

# దొడ్డ రామాయణము

ప్రథమ భాగము


గ్రంథకర్త:

దొడ్ల వేంకట రామరెడ్డి





ప్రకాశకులు:

ప్రబోధ పుస్తకనిలయము

గూడూరు

1955




మూల్యము:
రు. 8-0-0



శ్రీ రాజా వేలుగోటి
సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్ర
బహుదూరువారు
వేంకటగిరి

గ్రంథకర్త
శ్రీ దొడ్ల వేంకట
రామరెడ్డిగారు
కావలి

# శ్రీ దొడ్డ రామాయణము

## (ద్వితీయ ముద్రణము)

### సంపాదకుని విన్నపము

మనము జీవించు కాలము కలియుగమైనను ఒక విధముగ విశిష్టమైనదని చెప్పనచ్చును. మానవుఁడు తాను మఱచిన తన ఔన్నత్యమును జ్ఞప్తికి తెచ్చుకొని దానిని సిద్ధింపఁజేసికొనుటకై అనేక విధముల పాటుపడుచున్నాఁడు. బహుకాలమునుండి తన్ను కట్టివైచినవని తలఁచిన రాజకీయ సాంఘిక వైజ్ఞానిక బంధములను ద్రెంపుకొని విముక్తుఁడగుటకును, తనయొక్కయు తన సంఘము యొక్కయు శ్రేయస్సు నభివృద్ధి పఱచుకొనుటకును స్వేచ్ఛామార్గముల యత్నించుచున్నాఁడు. సర్వప్రయత్నములకు ఉత్తమసౌఖ్యానుభూతియే లక్ష్యము గనుక, అది సిద్ధించుదనుక నాతఁడా ప్రయత్నమును విరమింపఁడని మన మాశింపవలసి యున్నది.

కాని సంప్రదాయపరుల కీ స్వేచ్ఛాప్రవృత్తి కొంతమనః క్లేశమునకుఁ గారణమగుచున్నది. సర్వభూత ప్రవృత్తులును పరమకారణుఁడైన పరమేశ్వరునియందలి విన్యాసములే గనుక, కలుషితమైన ప్రవాహజలము కాలము గడచుకొలఁది నిర్మలమగునట్లు ఇప్పుడు కాన్పించు వైపరీత్యములెల్లను కాలాంతరమున మరల సహజరూపమును బొందగలవని మనమూహింప వచ్చును.

అయినను శాశ్వతధర్మప్రతిపాదకములును ప్రబోధ సమర్థములునైన గ్రంథరాజములను జ్ఞానపిపాసువులగు జనులకు సంధఁ జేయుట మన విధియై యున్నది. నేటి విద్యావ్యాప్తి దీనికెంతయుఁ దోడ్పడఁగలదు. తత్సిద్ధికై 1954 సం. ఆగస్టు తే 5 దిన గూడూరున 'ప్రబోధ పుస్తకనిలయ'మను పేరుతో నొక సంస్థ ప్రారంభింపఁబడినది. దాని ప్రథమఫలితముగ శ్రీ దొడ్డ రామాయణము పునర్ముద్రితమై వెలువడుట యొక సుకృతవిశేషము.

ఈ గ్రంథరాజ మిప్పటికప్పుడే ఆంధ్ర ప్రజల మన్ననాదరణములను బొందినది. పండితులేగాక సామాన్యులగు స్త్రీపురుషు లనేకులు గూడ దీని కథనానైపుణ్యమునకును వచనమాధుర్యమునకును

ముగ్ధులై ప్రశంసించుట నేను వినియున్నాను. దీని కెల్లను గ్రంథకర్త యగు శ్రీ రెడ్డిగారి మనస్సు 'మరందమాధురీమయంబును శిరీష కుసుమకోమలంబు' నగుటయేగాక 'సర్వభూతహిత'సంపన్నంబును నిరంతరము శ్రీరామచంద్రపదపంకజాసక్తంబు నగుటయే కారణము. ప్రబోధపుస్తకనిలయము శ్రీరెడ్డిగారి ఇతర గ్రంథజాలమును గూడ నచిరకాలములో తిరిగి ముద్రింపించి ఆంధ్రలోకమునకు నందఁజేయఁ గలదని యాశించుచున్నాను.

పరమేశ్వరునికన్న మానవునే ఎక్కువగ నర్చించు నీదినము లలో, 'నేను నరుఁడనే'నని చాటుకొన్న నృపాలశేఖరుఁడగు శ్రీరామ చంద్రమూర్తి జీవితగాథ సర్వప్రామాణికమై వెలయఁగలదని విశ్వ సింపవచ్చును. అదియునుగాక, అనుదినము ప్రతి ఆంధ్రగృహము నందు పూజానంతరము, 'భగవాన్ సర్వదేవాత్మకః శ్రీరామచంద్రః సుప్రీతః సుప్రసన్నః వరదో భవతు' అని చెప్పఁబడుచుండుటచేతను, ఆంధ్రదేశములో శ్రీరామమందిరములేని కుగ్రామమైనను లేకుండుట చేతను శ్రీరామచంద్రుఁడు ఆంధ్రుల ఇష్టదైవమై వారి దైనందిన జీవితజ్యోతియై వెలుఁగుచున్నాఁ డనుటకు సందియములేదు. శ్రీ సీతా రాముల నిష్కళంక త్యాగము నిర్వ్యాజప్రేమ ఆత్మస్థైర్యము ఆంధ్రుల హృదయములయందు ధర్మమును సుప్రతిష్ఠితముగఁ జేసినవి. ఈ ధర్మ ప్రవృత్తి నింకను వృద్ధిఁబొందించుటలో శ్రీ దొడ్డ రామాయణ మెక్కువగఁ దోడ్పడఁగలదని నేను నమ్ముచున్నాను.

ఎంత జాగరూకతతోఁ బరిశీలించినను కొన్ని ముద్రణాది స్ఖాలిత్యములు గ్రంథమునం దచ్చటచ్చటఁ గాన్పింపఁగలవు. పాఠక మహాశయు లోర్పువహించి మన్నించెదరని ప్రార్థించుచున్నాను.

గూడూరు
12-3-55

శ్రీకంఠం కృష్ణరావు
సంపాదకుఁడు

శ్రీ

# విజ్ఞాపనము

శ్రీరామచరిత్ర సర్వలోకవిదితము. ఆ చరిత్రను వాల్మీకిమహర్షి సంస్కృతభాషయందు రచించెను. రామచరిత్రకు వాల్మీకి కవితాశక్తియు వాల్మీకి కవితాశక్తికి రామచరిత్రయు నెంతయుఁ దగి పువ్వును దావియువలె నన్యోన్యశోభావహములై విరాజిల్లుచున్నవి. వాల్మీకివలన రాముఁడును రామచరిత్రరచనవలన వాల్మీకియు శాశ్వతులైరి.

రామాయణంబును ఆదికావ్యమనిరి. అట్లనుటంజేసి తత్పూర్వము ఛందోనిబద్ధకావ్యరూపగ్రంథము లేదని యేర్పడుచున్నది.

వాల్మీకిమహర్షి శ్రీరామునకు సమకాలికుఁడు. ఆయన మహాతపశ్శాలియగుట వాని నామమే సూచించుచున్నది. అంతటి మహాత్ముని రామాయణరచనకు బ్రహ్మ నియమించి త్రికాలజ్ఞానంబును వానికిఁ బ్రసాదించి వాని నోట నసత్యము వెలువడదని వరమిచ్చి చనెను. అట్లు పరమేష్ఠివలన నిర్ణీతుఁడై యనృతము పలుకనని ప్రతిజ్ఞచేసి వాల్మీకి మహర్షి రామాయణంబును రచించెను. కావున రామాయణము చారిత్రాత్మక గ్రంథమేగాని కొందఱు శంకించునట్లు కవికల్పితం బెంతమాత్రముఁ గానేరదు.

వాల్మీకిమహర్షి రామాయణంబును కుశలవుల జననానంతరమే రచించినట్లు తద్గ్రంథమే తెలుపుచున్నది. రామాయణంబును షట్కాండపర్యంతమే వాల్మీకి రచించెనని కొందఱందురు గాని సప్తకాండములు వాల్మీకియే రచించెనని రామాయణమువలననే స్పష్టము.

వాల్మీకి తన గ్రంథమునుగూర్చి 'ఉదారవృత్తార్థపద మనోహరం' బనియు, 'తదుపగత సమాససంధియోగబంధురం' బనియు, 'సమ మధురోపనతార్థవాక్యబద్ధ' మనియు వచించెను. ఈ విశేషణంబులు అక్షరాక్షరంబుల సత్యంబులు. కావుననే రామాయణం బంత రుచివంతమై వినువారిని దన్మయ మొనర్చుచున్నది.

శ్రోతల చిత్తంబు నాకర్షించి తన్మయత్వ మొనర్చి యయ్యా రసంబుల నోలలాడించునదే కవిత్వమగును, కవిత్వంబునకు రసము

జీవము. రసాస్వాదనశక్తి పుట్టువుతోడనే రావలయును. పాండిత్యాదులు దానికి మెఱుంగులగును. ఈ రసంబును సమయోచితంబుగాఁ జవిచూప వలయునేగాని క్రుమ్మరింప రాదు.

ఈ రసాస్వాదనము ధ్వనిప్రాణితమైనచో శ్రోతల మనఃపరిణతిని బట్టి వింతవింత రుచులను గలిగించుచు నెంత ద్రావినను వారిని దనియ కుండునట్లు చేయును. అట్టి కవిత్వమే యుత్తమ కవిత్వమగును.

కవిత్వంబునకు ఔచిత్యంబెంతయుఁ బ్రధానము. దానినిఁ జక్కఁగాఁ బాటింపనిచో రసభంగము గలుగకమానదు. ఔచిత్యము శబ్దగతమనియు భావగతమనియు ద్వివిధము. సందర్భమునకుఁ దగినంత మాత్రమే భావంబును వెల్లడించుట భావౌచితి యగును. ఆ భావ ప్రదర్శనంబునకుఁ దులతూఁచినట్లు తగిన పదమును బ్రయోగించుట శబ్దౌచితియగును. భావార్థంబులు రెండును నొండొంటికిఁ దులతూఁచి నట్లుగా నుండునేని ఆ కవిత్వము సజీవకవిత్వ మగును. ఈ శక్తిని సంపాదించుటకుఁ బాండిత్యమెంతయుఁ దోడ్పడును. పాండిత్యంబునకుఁ దోడుగా యుక్తాయుక్త వివేకమును లోకజ్ఞానంబును గూడినచో నెంతయుఁ బ్రశంసనీయమగును. ఇన్ని యుండియుఁ గవి మనస్తత్త్వంబు మరందమాధురీమయంబును శిరీషకుసుమకోమలంబును గానిచో వాని రచన బెట్టగానుండునేగాని సర్వజనమనోరంజకము కానేరదు. సర్వభూతహితబుద్ధియున్నగాని యట్టిమనస్తత్త్వంబు గలుగదు. అట్టిబుద్ధి జీవన్ముక్తుని లక్షణము. కావుననే ఋషిగానివాఁడు కవి కానేరఁ డనిరి. ఇవియెల్ల వాల్మీకి మహర్షియందు సమగ్రంబులు. కావుననే వాని కవిత్వము అసదృశమై చదువఁజదువ రుచులూరించుచుఁ దనివి దీఱకుండును.

కవులు భావపరిస్ఫుటార్థము శబ్దాలంకారంబుల నర్థాలంకా రంబుల నాశ్రయించుట కలదు. ఇట్టి ప్రతిభావ్యాయామమునకన్న ఉన్నదియున్నట్లు తేటమాటలతోఁ బొంకముగా వివరించి భావస్ఫుటం బొనర్చుట కడిఁదికార్యమేగాక మనోహరముగాఁ గూడ నుండును. ఇది యందఱిసొమ్ము కాఁజాలదు. ఇట్టి కవిత్వము బాలవృద్ధావబోధక మగుటయేగాక బహుజనాదరణీయమై శాశ్వతంబుగా నిలుచును. కవి కేవలచిత్రకారకుఁడు మాత్రమేగాఁడు; బోధకుఁడును శ్రోతృజనాంతః పరిణామప్రదుఁడు నగును. లోకోభ్యున్నతి కవీంద్రులపై నాధారపడి

యున్నదని చెప్పుట యతిశయోక్తిగాదు. కావుననే కవీంద్రు లపూర్వ సృష్టికర్త లగుదురు. పై లక్షణంబులెల్ల వాల్మీకి కవిత్వంబున సమగ్రంబులు. దానం జేసియే వానిని గవికోకిలం బనిరి.

రామాయణమందుఁ గొన్ని యంశంబులు సామాన్యధర్మదృష్టికి విపరీతంబులై తీఱనిశంకలు గలిగించుచున్నవి. ఈ యంశంబులను విశేషధర్మదృష్టితోఁ బరిశీలించినచో నట్టి శంకలు తప్పక తీఱును. ఈ ధర్మసూక్ష్మంబులు సామాన్యునకు గోచరింపవు. భీష్ముఁడంతటి వాఁడు గూఁడ దనకేది హితమో నిశ్చయించుకొనలేక సర్వజ్ఞుఁడైన శ్రీకృష్ణభగవానునకు స్వహితనిశ్చయార్థమై చరమప్రార్థనంబును గావించెననఁగా నితరులసంగతి చెప్పవలయునా? తెలియని దానిని తెలిసికొనుట యుక్తమగునేగాని విపరీతార్థంబులకుఁ జిక్కుట సరిగాదు.

రామావతారకారణము ఉత్తరకాండమందుఁ గలదు. సౌకర్యార్థము దానిని మొదటనే చేర్చి పూర్వకాండమని పేరిడితిని. వాల్మీకి గ్రంథంబునకు నా రచన తర్జుమా గాదుగాని దానిని బ్రాయికముగా ననుసరించితిని. ప్రక్షిప్తములను వదలితిని. మహర్షి సూచించిన భావంబులను గొన్నిటిని సుంత వివరించితిని. సందర్భోచితంబుగాఁ గొంత చేర్చితిని. పఠన సౌలభ్యార్థము కొన్ని పద్యములను గ్రంథాంతరంబులనుండి గ్రహించితిని. కొన్నింటిని స్వయముగా రచించి కూర్చితిని. “ ” ఈ గుర్తుగల పద్యంబులు గ్రంథాంతరస్వీకృతములు.

విప్రలంభపరిణామంబగు కరుణరసంబును శ్రోతలకు మఱికొంత చవిచూపు తలంపుతో భవభూతిరచించిన యుత్తరరామచరిత నాటకంబునుండి గొంతభాగంబును శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి తర్జుమాను గ్రహించి కూర్చితిని.

రామాయణసారంబును గ్రహింపవలయునన్నచో మూలగ్రంథమునే చదువవలయును. అందులకు గీర్వాణభాషాజ్ఞానము వలయును. అదియెల్లరకుఁ గలుగదని యాంధ్రభాషాజ్ఞానమాత్రుల కళ్యాణార్థము భాస్కరాదికవీంద్రులు ఆంధ్రపద్యప్రాయంబుగా రామాయణంబును మహారసవత్తరశైలి రచించిరి. వచనకావ్యరచనకు నవకాశమిప్పుడు గలిగినందున నిటీవల నొకరు దానిని గద్యాత్మకంబుగా రచించిరి. అట్లు వారాంధ్రప్రపంచంబును ధన్య మొనర్చి తాము

ధన్యులైరి. అట్టి యుద్గ్రంథంబులుండగా మరల నేనీగ్రంథంబు వ్రాయ నేల యనవచ్చును.

బాల్యంబునుండి రామాయణమందు నాకుఁ బ్రీతి మిక్కుటము. 1899 వ సంవత్సరంబున మాకు మొల్లరామాయణంబును బ్రవేశ పరీక్షాపఠనగ్రంథముగా నిర్ణయించిరి. దానిని జదువుటవలన రామ చరిత్రయందలి నా ప్రీతి రెట్టించెను. అప్పుడప్పుడే యాంధ్రభాషయందు నాకు నుంత ప్రవేశమంకురించుచుండెను. అప్పుడు నాకు సహాపాఠియైన శ్రీ మేడిశెట్టి వెంకటాచలమునాయుడుగారు రామాయణంబును నవల రూపంబున వ్రాయవలసినదని నాటనుండి నన్ను బలవంతపెట్టసాగెను. అందులకుఁ జాలనని మిన్నకుంటిని.

1932 వ సంవత్సరంబున గీతాహృదయ రచనకుఁ దొడంగి యందు రెండధ్యాయంబులు పూర్తిగావించితిని. అది కేవలవేదాంత విషయంబగుటంజేసి యందే నిరంతరము పరిశ్రమించుట నుంత శ్రమగాఁ దోఁచెను. ఆక్లేశమును గావ్యరసాస్వాదనంబునఁ బాపఁదలంచి వాల్మీకిరామాయణంబును వ్యాఖ్యాచతుష్టయ సమన్వితంబుగాఁ జదువ నారంభించితిని. కొన్నాళ్ళు చనఁగా, నాచదువుభాగంబు నప్పుడప్పుడే యాంధ్రవచనరూపంబున వ్రాయఁదగదా యనుతలంపు తెలసూపెను. ఆ సంకల్పము దొడ్డరామాయణ రూపంబునఁ బరిణమించెను.

నిష్కామకర్మయోగమే వాస్తవమైన గృహస్థధర్మము. అట్టి ధర్మంబునకు శ్రీరామచరిత్ర మహోత్తమమైన లక్ష్యముగా నున్నది. జీవితముయొక్క పరమావధి ముక్తి అనిరి. ముక్తి అనఁగా విడుదల అని యర్థము. విడుదల అగుటకుఁబూర్వము బంధంబుండవలయును. ఏల ఎప్పుడు ఎవరు దేనిని బంధించిరి ? అను ప్రశ్నలు తప్పక వచ్చును. ఈ నాల్గింటి విచారమే తత్త్వశాస్త్రము. సంగమే బంధనంబనియు అసంగమమే ముక్తియనియుఁ దత్త్వశాస్త్రనిశ్చయము.

అట్టి అసంగసిద్ధి కలుగుటకుఁగా కర్మభక్తిరాజజ్ఞానములనెడి నాల్గుమార్గంబులను జెప్పిరి. ఈ మార్గములనే యోగములందురు. నాదికాదు అను భావమే అసంగయోగము. అది యొకవిధమైన మనస్తత్వము. కర్మయోగులు తమ కర్మఫలంబును తమదిగా భావింపకపోవుటచేత మనస్తత్వం బట్టిదిగా నగుచున్నది. భక్తి యోగులు తమరినే ఈశ్వరార్పణము చేయుటవలన వారికిఁగూడ

[illegible] స్వరూపము సిద్ధించుచున్నది. [illegible] యోగము [illegible]యోగము [illegible] సిద్ధించుట [illegible]గానే యున్నది.

ఎల్లయోగములసిద్ధి అసంగమే గావునను, వారు వారు వారి వారి వర్ణాశ్రమ దేశకాలస్థితులనుబట్టి యనుకూలమైన మార్గము ననుసరించి అసంగసిద్ధినిఁ బడయవచ్చునవియు, ఆ నాల్గు యోగములలో ఒకటి హెచ్చు ఒకటితక్కువ అనుభావము సరిగాదనియు, లోకమందు గృహస్థులు బహుళమగుటంజేసియు గృహస్థులకు మోక్షము లేదను తలంపుతో అన్యమార్గంబులను అనుష్ఠింపవలసినది లేదనియు శ్రీరామ చరిత్ర బోధించుచున్నది. ఈ కారణముచేతనే రామాయణము సర్వజనులకుఁ బ్రియతమముఁ బ్రశంసనీయమునై గ్రాలుచున్నది.

మా వంశనామధేయము 'దొడ్డ' అనియుండి కాలక్రమంబున 'దొడ్ల' అను మార్పుచెందెను. రామాయణము దొడ్డగ్రంథమగుటం జేసియు, మా యింటిపేరుగూడ 'దొడ్డ' అగుటవలనను ఉభయార్థ ద్యోతకంబుగా నా రచించిన దానికి 'దొడ్డరామాయణ' మను పేరిడితిని.

నా తండ్రిగారికి బొబ్బిలిమొదలు కార్వేటినగరమువఱకుఁ గల సంస్థానాధీశులు చిరపరిచితులు. అందు శ్రీ వేంకటగిరి సంస్థానాధీశులు ముఖ్యులు. నాకును ప్రకృతము శ్రీ వేంకటగిరి సంస్థానాధీశులైన శ్రీ శ్రీ రాజా వెలుగోటి సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్రబహదూరు వారికిని దొలుదొల్తఁ గావలిగ్రామంబున 1926 వ సంవత్సరంబున వారు కుమారరాజుగానున్న కాలములో సమావేశము గలిగెను. అది క్రమక్రమంబుగా వర్ధిల్లి తుదకు వారు నా యెడ మిత్రభావంబును జూపునంతగా నయ్యెను. వారి యంతస్సత్త్వంబును గ్రహింపఁగల్గితిని. వారి హృదయము నిరంతర రామధ్యానపరమై యుండుటయు, ఎన్నఁడేనియుఁ గార్యాంతర ప్రయాణాదులవలన రామపదపూజకు నవకాశము గలుగనినాఁడు వారికొక దుర్దినమగుటయు సుగతమయ్యెను.

ఒకప్రక్క సిరిసంపదలతోఁ దులతూగుచుండియు, ఎల్లయకార్యంబులకు బీజప్రదములైన భాగ్యోన్నతులుండియు, వానికిఁ బరవశముగాక దైవభక్తియు ధర్మరక్తియుఁ గలిగియుండుట సుకృత విశేషముగాని వేఱుగాదు. ఇట్టివారు భోగవాసనావిశిష్టులైన యోగ భ్రష్టులగుదురని గీతావాక్యము.

శ్రీ రాజాగారి యందుఁగల యీ శుభలక్షణంబులు నా హృదయంబు నాకర్షించెను. వారికీర్తి సుప్రతిష్ఠమగుట యుక్తమని తోఁచెను. తదర్థము నా రచించు గ్రంథంబును వారికి సంకితం బొనర్పఁదలఁచి నా తలంపును వారికి నెఱిఁగించితిని. నా యెడ వారికిఁగల ప్రేమాతిశయంబునఁ జేసి నా ప్రణయమును వారంగీకరించిరి. శ్రీవారి విశిష్టశుభగుణగౌరవసూచకంబుగాఁ బ్రతిఫలనిరపేక్షతో వారి నీ గ్రంథంబునకుఁ గృతినాయకులనుగాఁ జేసితిని.

ముద్రణంబున అఱసున్నలు శకటరేఫలు కొన్ని యెడలఁ దాఱుమాఱయ్యెను. గ్రంథవిస్తరభీతిం జేసి వానిని సవరణపట్టికలోఁ జేర్పనైతిని. అజ్ఞానజనితంబులోండెఁ బ్రమాదవశంబులోండెఁ దోషంబులు కొన్ని యీ గ్రంథంబునఁ గానరావచ్చును. వానిని దెలిపినచోఁ బునర్ముద్రణంబునఁ గృతజ్ఞతాపూర్వకంబుగా సవరించుకొందును.

ఈ గ్రంథంబును ముద్రణంబునకు నొసఁగితినేగాని, వ్యాపారపర్యటనవిశేషంబున నొకచోటియునికి నాకు దుర్లభమగుటం జేసి, ముద్రితభాగంబును సరిచూచుటకుఁగూడ సాధ్యము గాదయ్యెను. ఆ భారంబునెల్ల శ్రీ వాయునందన ముద్రాక్షరశాలవారే యోపికతో భరించి ముద్రణంబును బూర్తిజేసిరి. అందులకై వారికి వందనపరశ్శతంబు లర్పించుచున్నాను.

నా రచించిన కళావతీయుగంధరవిజయంబులవలె ఈ గ్రంథము గూడ మద్గురువర్యులగు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి శుభవిమర్శనదృష్టికి నోఁచియున్నచో యెంతో బాగుగానుండును. వారు కీర్తిశేషులగుటం జేసి యాకలిమి దవ్వయ్యెను. ఇది గొప్పదురదృష్టము.

ఏ రామభక్తి బాల్యంబునుండి నాయంతర్లీనమై శుభాశుభంబుల వెంటఁ జేయూఁతగాఁ బరగుచు నా జీవితంబును గొనసాగించుచున్నదో ఏ రామభక్తి వాల్మీకిమహర్షి నుద్ధరించి తన్ముఖంబున రామాయణంబును సర్వలోకకళ్యాణంబుగా వెల్లడించెనో, ఆ రామభక్తి వలనఁ బ్రేరితుఁడనై నా గావించిన యీ సేవను ఆంధ్రప్రపంచం బంగీకరించి నన్ను ధన్యునొనర్చుఁగాక.

15—10—40
మకాం, కలిచేడు

ఇట్లు బుధవిధేయుఁడు,
దొడ్ల వేంకట రామరెడ్డి
గ్రంథకర్త

శ్రీ

# రత్నమాల

---

శా॥ శ్రీసీతాకరసంపుటమ్మత్యములై సేసల్ పయిన్ జాలుచో
నా సంతోషము సుస్మితాయతనిజాస్యంబందుఁ దోల్కాడఁగా
వాసింగాంచిన రామభద్రుని కృపావాత్సల్యదృగ్జాలముల్
శ్రీసర్వజ్ఞకుమారకృష్ణవిభునిం జేయున్ శుభప్రాభవున్॥ 1

సీ॥ నిర్వ్యాక్రవిక్రమ నిపుణత మెఱయించి
ప్రథితరాజ్యశ్రీని బడసినారు
హరిహర దేవాలయంబులు నిర్మించి
దైవప్రసాదంబుఁ దాల్చినారు
కవిరాజరాజి సత్కావ్యరత్నము లంది
చెలిమి వాగ్దేవిఁ బూజించినారు
అఖిలాన్నసత్రమహాగ్రహారంబుల
దానసన్మానముల్ దనిపినారు

గీ॥ తలను వ్రాల్పని కీర్తిపతాక యనఁగ
సింహపురికళాశాల సృజించినారు
ప్రణుతిపాత్రులు గారొకో ప్రజలకెందు
వేంకటగిరివెల్గోటి పృథ్వీపవరులు ?॥ 2

శా॥ కాలాతిక్రమ లుప్తధర్మపరిరక్షాదీక్ష సంధిల్లఁగా
లీలామానుషవిగ్రహుండగుచు హాళిన్ లోకముల్ ప్రోచు నే
కాలాతీతుఁడు వాని దివ్యకృప నెక్కాలంబు నిత్యోన్నతిం
గ్రాలుంగాక, కుమారకృష్ణపృథివీకాంతా ! భవత్సంతతుల్॥3

చ॥ వినయము శాంతభావము వివేకము సౌమ్యగుణంబు వాక్ప్రసా
దనమును గల్గినం గలుగుఁ దాదృశసంపదకెల్ల జీవమో
యను నవనీతతుల్యహృదయంబు విశిష్టవిభూషమై సహో
వనిధవకోటి మీకు నొకవన్నెను గూర్చెడుఁ గృష్ణభూవరా!॥4

ఉ॥ మాటల తేటతీపు లవిమర్శక బుద్ధిగ్రహింప వెన్నడున్,
జేటొనరించినన్ మదిని జేర్పవు, పారవిచారదృష్టమై
నాటినభావ మంతరమునం గనుగందఁగనీవు, ధాత్రి నీ
సాటిదొరల్ భవత్కులయశః ప్రసవంబులుగారె! భూవరా!॥ 5

ఉ॥ పోలి సహస్రవర్షములకేవ్యాలఁ దక్కిన రాజ్యలక్ష్మి చే
తాళపరాక్రమార్జిత యథాగతి మీ కులమందు నిల్చి నీ
పాలనఁగోరె న ప్పరమభాగ్యవతిన్ సుకుమారి సుందరిన్
లాలన చేసి పొందు మకళంక మహోన్నతభోగసంపదల్॥ 6

మ॥ సిరియున్ రాజ్యము భోగ్యవస్తుచయముం జేరన్ భవాంబోధిసం
తరణాసక్తియు రామపాదకమలధ్యానంబు నిక్కాలమం
దరుదా నైనఁ గుమారకృష్ణవసుధేశా! నీయెడన్ మూఁడు సు
స్థిరమయ్యెం దగదే వరింప నినుఁ బ్రీతిం గావ్యకన్యామణుల్? 7

ఆ॥వె॥ సత్యమొక్కఁడు మఱి సర్వభూతహితంబు
నెల్లధర్మములకు నెల్ల యండ్రు;
రాజపదవి వాని రక్షణార్థమగుట,
రామచరితఁ గఱపు, రాజవర్య!॥ 8

క॥ ఎందాఁకనుండు భారతి
యెందాఁకను రామచరిత యొసఁగు వసుధలో
నందాఁక నీ యశము పెం
పొందుత సర్వజ్ఞమగుచు నుర్వీనాథా!॥ 9

20—1—40
మకాం, నిత్యకళ్యాణి.

దొడ్ల వెంకటరామరెడ్డి,
కృతికర్త.

శ్రీరస్తు

## సౌజన్యసింధువులైన శ్రీయుత దొడ్ల వేంకటరామరెడ్డిగారికి మిత్రుఁడు దుర్భా సుబ్రహ్మణ్యశర్మ ఆశీర్వచన పురస్సరముగా వ్రాసిన లేఖ :

తమరు ప్రీతిపూర్వకముగాఁ బనిచిన 'దొడ్డరామాయణము'ను దిలకించి యమందానంద భరితుఁడ నైతిని. అందుఁ దొల్దొల్త నా మనంబున కచ్చెరువు గొల్పినది గ్రంథ విస్తృతి, సన్నని టైపులో డెమ్మిసైజున సుమారు వేయి పుటల గ్రంథమును వ్రాయుట కెంత దృఢవ్యవసాయము వలయునో అది ప్రాజ్ఞు లూహించుకొనఁ గలరు. అట్టి పూనిక యెల్లరకు సాధ్యముకాదు. మీరన్నట్లు మీ 'వృత్తి' యొకటి, 'యాశయము' వేఱొకటి. అట్లయ్యు నైదేండ్లలో నింత గ్రంథము రచించుటకు మీకుఁ బ్రేరకము కీర్తి యందలి రక్తియో, శ్రీరామచరణభక్తియో యై యుండవలయును. మిమ్మెఱింగిన యెవ్వరుగాని మీరు తొలిదాని నంతగాఁ గాంక్షించువారని యనుకొనరు. మఱియు, మీ నిరాడంబర జీవితము, మీ తత్త్వజిజ్ఞాస, యివి యట్టి తలంపును దూరీకరించుచున్నవి. కావున శ్రీరామకథయందలి ప్రీతియే మీ గ్రంథ నిర్మాణోద్యమమునకుఁ గారణమని నే నూహించుచున్నాను. మీతోడి సంభాషణములవలన నేను గ్రహించినంతవఱకు మీ 'హృదయమున' నాకుఁ గానవచ్చినంతవఱకు, మీ డెందము నిర్గుణము ప్రక్కకన్న సగుణమువంకకే ములుసూపుచున్నదని నా యెన్నిక. కావున 'సంభవామ్యాత్మమాయయా' అని వాకొని యట్లే యవతరించుచున్న సగుణబ్రహ్మముయొక్క యసంఖ్యావతారములలో శ్రీరాముని పవిత్ర చరిత్ర మీ డెందము నతికట్టుటబ్బురము కాదు. మొల్లరామాయణము చదువుటచే ముప్పది సంవత్సరములకుఁ బూర్వమెన్నఁడో హృదయమున నాటుకొన్న భక్తిబీజము, తత్త్వవిమర్శల దోహదముఁ బొరసి యింత కాలమునకు మొలకెత్తి పతితలోకపారిజాతమగుట మీ పూర్వపుణ్యవిశేషమని భావించుచున్నాను.

వాల్మీకిరామాయణమునకుఁ దెనిగింపులు పెక్కులు గలవు. కాని వానిలో నేదిగాని భాస్కరరామాయణము వలె జనప్రీతిపాత్రమైనట్లు కానరాదు. అదేమివింతయో గాని, ఆ తెనిఁగింపులలో ఉత్తరోత్తరములకన్నఁ బూర్వపూర్వములే జనప్రియములుగాఁ గానవచ్చుచుంట విశ్వజనవిదితము. రామాయణమునకు యథామూలములైన ప్రసన్నని తెనిఁగింపులు గద్యరచనలు ఒండు రెండు గలవు. అవి వెనుకటివారి పద్యరచనలకన్న హృద్యములుగా నున్నవని కొందఱిమతము. ఇంతకును గ్రంథమున డెందమును బందిగొనునది రసస్ఫూర్తిగాని, కబ్బముయొక్క బాహ్యరూపము (పద్యము ఒండె-గద్యమొండె) కాదుకదా! మీ రచన యా గద్యకృతుల నతిశయించుచున్నది. మఱియు మీరు గ్రహించిన యానుపూర్వింబట్టి విశిష్టముగాగూడ నున్నది. 'కళావతి' దొరఁకొని వికసిలుచుండిన మీ వచన రచన యీ దొడ్డకృతియందుఁ బరిణతమై చక్కని సౌరభము వెదచల్లుచున్నది. ఒక్కొక్కయెడ నవలలను, ఒక్కొక్కయెడ నాటకములను దలఁపించుచు మీ కథనమార్గము రసప్రచురముగా నున్నది. పాత్రోచిత సంభాషణలతో సెప్రధానములగు కథాభాగములు నడపుటయును, ఆ ప్రసంగములు మీ చిత్తతరంగితములై యుండుటయును మీ రచనకు అపూర్వ వాల్లభ్యము నాపాదించుచున్నవి.

మీ రుదాహరించిన పద్యములు ఉత్తమోత్తమములు. అందు మీ యభిరుచియుఁ గొన్ని కలవు. కాని మీరు నైషధ భారత భర్తృహర్యాది కృతుల నాశ్రయింపక భాస్కరరామాయణ రామాభ్యుదయాది కృతులనుండియు, ఆంధ్రీకృతములైన 'జానకీ పరిణయా'ది రామపరబహురూపకములనుండియు మాత్రమే పద్యము గ్రహించియున్న సందర్భశుద్ధి ఇంకను బంధురముగా నుండెడిది. ఇప్పుడున్న తెలుఁగునఁ దత్తద్గ్రంథముల యెఱుక గలవారి మనస్సు, రామకథనుండి మరలి తత్పద్యకర్తృరచనారుచిరతా పరామర్శకము గుచుండును. రావణుఁడు సీతను వర్ణించుపట్ల — కీచకుఁడు ద్రౌపదిని వర్ణించు తిక్కనపద్య మొకటి (గంధము మీలకుఁబుట్టి-ఇత్యాది) ఒండు రెండుచోట్ల నుదాహృతమై యున్నది. ఇది విరాటపర్వ కథవంకకో, తిక్కన కవితాచమత్కృతి వంకకో మనస్సును మరల్చి ప్రకృతకథావధానమున కించుక యడ్డుతగులును. ఐనను అట్టి గ్రంథములతోడి పరిచయములేని పఠితలకుఁ బలువురకు ఈ యుదాహరణములు సహృదయాహ్లాదన హేతువులుగా నుండు ననుట నిరవద్యము. ఉత్తరకాండములోని కథ కొంత ముందుకు నెట్టి తక్కువభాగమును ఉత్తరరామచరిత నాటకముతో జోడించుట యందు మీ రసజ్ఞత ప్రకటితమగుచున్నది. కొన్ని స్తవములు సంస్కృతమున నున్న వాని నట్లే యుంచుట భక్తులగు పఠితలకుఁ బారాయణమున కత్యంతానుకూలము. ఎంత పెనఁగినను, సంస్కృతమునకున్న గౌరవము తెనుఁగునకు రాదనుటకు, ఇదానీంతనుల భగవద్గీతాద్యాంధ్రీకరణములు పెక్కులు ఉపేక్షితము లగుచుండుటయే తార్కాణము.

అయ్యై ఘట్టములలో ధర్మాధర్మములఁ గూర్చి మీరు చేసిన సంప్రధారణ తత్తత్పాత్రముల శీలమున కనురూపమై మీ లోకజ్ఞతను, మీరు చేసిన తత్త్వశాస్త్ర పరిశ్రమమును వేనోళ్లఁ జాటుచున్నది. దైవము-పురుషకారము, త్రిగుణములు - తత్ పరిణామములు, శాస్త్రము—పురుషబుద్ధి ఇత్యాది చర్చలలో మీరు పాత్రముఖమునఁ జేయించిన సిద్ధాంతములు శాస్త్రసమ్మతములై మూలమునకు మెఱుంగు పెట్టుచున్నవి. వీనిని విడఁదీసి చూపవలయునన్న విమర్శ విస్తృతమగును. దానికి వలయు నోపికయుం డె నవకాశమెుండెను నేఁడు నాకు లేదు. అయోధ్యాకాండములోని శ్రీరామ జాబాలి సంవాదము ఈ తెగ భాగములకుఁ దలమానికము.

మీ పదములు మృదువులు, సుప్రసిద్ధములు; సమాసములు సుభగములు; అన్వయ మక్లిష్టము, శైలి సరళము, ధార యనర్గళము. వేయేల, మీ గ్రంథము పండితులకుఁ బరితోషకారియై పాఠకులకుఁ జగువఁజదువ రసమొలికించునదియై చిరకాల మాంధ్ర దేశమునఁ బ్రశంసింపఁగల కతిపయకృతులలో నొకటిగా నుండుననియే నా దృఢ విశ్వాసము. బ్ర॥ శ్రీ॥ వేదము వేంకటరాయశాస్త్రులవారివలన మీరు వడసిన విద్యాతిశయము వితథము కాక యిట్టి మహనీయకృతి వ్రాసి యందు వారిని స్మరించుట మీ సౌజన్యము నకుఁ దగ్గయుండ దగియున్నది. ఈ రసోత్తర ప్రబంధము సంకితముగొన్న విద్వత్ప్రభువులు సర్వజ్ఞకుమార యాచేంద్రులవారు ధన్యులు. తద్వంశమువారు రచించిన, కృతిగొన్న బహుగ్రంథములవలె నిదియుఁ దదీయ యశఃపతాకయై విరాజిల్లఁగలదు. ఇందు దొరలిన పలుతెగలపొరలు రెండవకూర్పున సవరింపఁబడఁగలవని విశ్వసించుచున్నాను.

అముద్రిత స్థితిలో నెక్కనాళ్ళ నాకడనుండినను నేను పరిచూడ నైతినమ్మకమునకు మనసు రానీక, అచ్చుపడిన వెనువెంటఁ జిత్తమును భరవి ప్రత్యక్షమున నా యభిప్రాయమును మరల మరలఁ గోరిన మీ క్షమాగుణము నెట్లు గడింపవలయునో

యెఱుంగకున్నాను. ఇట్టి గుణగౌరవముచేతనే మీకు అభిలషితము స్వాయత్తముగా నున్నను, భగవంతుఁడు మీకు నిరతిశయానంద ప్రదుఁడగుఁగావుత మని హృదయ పూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను.

మ॥ తినఁబెట్టన్ బటువైన కల్మి, సరళోదీర్ణ స్వభావంబు, చ
క్కని వైదుష్యము, తత్త్వతత్పరత, సౌఖ్యంబీను సంసారకే
లన: ముత్సాహము, నార్జవంబు, నివియెల్లన్ గూడ నీయందుఁ బ్రా
గ్జనిఁ బుణ్యంబుల నేమొనర్చితివొ వేంకట్రామరెడ్డ్యగ్రణీ॥

నెల్లూరు
24-1-42

మిత్రుఁడు

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.
Retired Telugu pandit.
V. R. College.

# విషయ సూచిక

## పూర్వకాండము :


విశ్రవసు జననము 1
వైశ్రవణ వృత్తాంతము 3
వైశ్రవణుఁడు లంకాపతియగుట 4
రాక్షసోత్పత్తి కథనము 4
హేతి సంతానము 4
సుకేసు జననము 5
మాల్యవదాదుల చరిత్ర 6
లంకా నిర్మాణచరిత్ర 6
మాల్యవదాదుల వివాహాదికము 7
దేవతలు శివుని శరణిల్లుట 8
దేవతలు విష్ణుని శరణిల్లుట 8
మాల్యవదాదుల మంతనములు 9
రాక్షసుల దండయాత్ర 10
విష్ణువు మాల్యవదాదులను నిర్జించుట 11
రాక్షసులు లంకనుండి పాతళపోవుట 13
రావణాదుల జననాదికము 14
దశగ్రీవుఁడు దనుజరాజ్యాభిషిక్తుఁడగుట 18
దశగ్రీవాదుల వివాహాదికము 21
దశగ్రీవుని దుండగములు 23
దూతను జంపుట 23
అన్ననోడించి పుష్పక విమానమును హరించుట 24
నందీశ్వర శాపము 27
శివుని తిరస్కరించుట 28
వేదవతిని బలాత్కరించుట 30
యజ్ఞభంగము చేయుట 31
నానారాజులను జయించుట — అనరణ్య శాపము 33
యముని జయించుట 34
రసాతల దండయాత్ర 40
వరుణుని జయించుట 41
నానాస్త్రీలను జెఱపెట్టుట 42
సోదరీ నిరసనము 43
రావణ శుక్రాచార్యుల సంభాషణము 44
రావణునకు విభీషణుఁడు హితవు చెప్పుట 44
రావణుఁడు రంభను ధర్షించుట 47
రంభ నలకూబరునిముందు విలపించుట 48
నలకూబరుఁడు రావణుని శపించుట 49
రావణుఁ డింద్రునిపై దండెత్తుట 49
ఇంద్రకృత శ్రీమహావిష్ణు స్తోత్రము 49
శ్రీవిష్ణువు దేవేంద్రు నోదార్చుట 52
దేవదానవ యుద్ధము 52
జయంత మేఘనాదుల యుద్ధము 53
దేవేంద్ర రావణుల యుద్ధము 53
మేఘనాదుఁడు దేవేంద్రునిబంధించుట 55
యుద్ధము మానుమని మేఘనాదుఁడు తండ్రికిఁ జెప్పుట 56
దేవతలు బ్రహ్మకు మొఱపెట్టుట 56
బ్రహ్మ రావణునకు వరంబులిచ్చి ఇంద్రుని విడిపించుట 57
బ్రహ్మ ఇంద్రునాశ్వాసించుట 57
రావణ కార్తవీర్యార్జునుల యుద్ధము 59
రావణుఁడు నర్మదలో నీరాడి శివపూజ సేయుట 59
నర్మద ప్రాఙ్ముఖియగుట 61
కార్తవీర్యార్జునుఁడు రావణుని బందీ సేయుట 63
పులస్త్యుఁడు రావణునివదలిపెట్టించుట 63
వాలిపయి రావణుఁడు దండెత్తుట 65
వాలి రావణుని భంగపఱచుట 65
దైత్యుల విశృంఖల చర్యలు 66


## బాలకాండము :


అయోధ్యా నగరము 68
రాజ్యాంగము 71
ధర్మ పరిపాలన ఫలము 72
దశరథుని సంతాపము 72
దశరథుఁడు పుత్త్రార్థము యజ్ఞమొనర్చుట 74
దశరథునకు సుమంత్రుని హితవచనము 74

ఋష్యశృంగుని చరిత్ర 75
యాగప్రకరణము 77
యజ్ఞారంభము 80
భోజనాదికము 80
యజ్ఞవేదికా నిర్మాణము 81
యజ్ఞదానాదికము 81
యజ్ఞాశ్వహోమాదికము 82
పుత్రకామేష్టి 82
యజ్ఞార్థము వచ్చిన బ్రహ్మతో దేవతలు మొఱపెట్టుట 83
దేవతలను బ్రహ్మ యోదార్చుట 83
తపస్సు - వాంఛితార్థ సిద్ధి 84
శ్రీమహావిష్ణు సందర్శనము 85
శ్రీవిష్ణువునకు దేవతలు మొఱలిడుట 86
శ్రీవిష్ణువు దేవతల నోదార్చుట 87
ప్రాజాపత్య పురుషుఁడు దశరథునకు బాయస మిచ్చుట 87
వానరావతార ఘట్టము 87
శ్రీరామాదుల జననము 89
విశ్వామిత్ర సమాగమము 90
దశరథునకు వసిష్ఠుఁడు హితంబుచెప్పుట 95
దశరథుఁడు రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంటఁ బంపుట 95
రాముఁడు బలాతిబలవిద్యలను గ్రహించుట 95
అంగదేశవృత్తాంతము 96
గంగాతరణము 97
మలినకరూశ దేశంబుల వృత్తాంతము 98
తాటకా వృత్తాంతము 98
తాటకావధ 100
గాధేయుఁడు రామునకు నానాస్త్ర ప్రదానము చేయుట 101
సిద్ధాశ్రమము 102
మారీచాదుల సంహారము 103
మిథిలాగమనము 104
గిరివ్రజపుర వృత్తాంతము 104
గాధేయ జననము 107
కౌశికీనది వృత్తాంతము 107
దేవతలు నిస్సంతానవంతులగునట్లు పార్వతి శపించుట 108
షణ్ముఖ జననము 109
గంగావతార చరిత్ర 110
సగరుఁడు యజ్ఞము సేయుట 110
సగర యజ్ఞాశ్వహరణాదికము 111
గంగావతరణము 113
గంగకు జాహ్నవియను పేరు వచ్చుట 115
గంగకు భాగీరథియనుపేరువచ్చుట 115
విశాలానగర వృత్తాంతము 116
సముద్ర మథనాదికము 116
కూర్మావతారాదికము 116
దేవేంద్రుఁడు దితిగర్భంబునుఁద్రచ్చుట 117
అహల్యా వృత్తాంతము 119
అహల్యాకృత రామ స్తవము 120
జనకుని యజ్ఞము 122
జనకుఁడు విశ్వామిత్రాదుల సందర్శించుట 122
విశ్వామిత్రుని చరిత్ర 124
వసిష్ఠ విశ్వామిత్రుల వైరము 124
విశ్వామిత్రుఁడు రాజ్యమును సన్న్యసించుట 126
విశ్వామిత్రుఁడు మరల వసిష్ఠుని దార్కొనుట 127
విశ్వామిత్రుఁడు త్రిశంకునకు సశరీర స్వర్గమిచ్చుట 128
అంబరీషోపాఖ్యానము 132
ద్వితీయ భంగము 134
తృతీయ భంగము 135
బ్రహ్మత్వ సిద్ధి సాధనవిచారము 136
సర్వము యత్నసాధ్యము 137
శివధనుర్భంగము 139
దశరథాగమనము 141
ఇక్ష్వాకువంశక్రమము 143
జనకవంశక్రమము 144
ముహూర్త నిశ్చయము 145
సీతాకళ్యాణము 146
విశ్వామిత్ర నిర్గమనము 148
జనకోపదేశము 149
రామ పరశురామ సమాగమము 149
వసిష్ఠుఁడు రామునకుఁ బరశురామ చరిత్ర చెప్పుట 153
అయోధ్యానగర ప్రవేశము 156

## అయోధ్యాకాండము :


దశరథ మంతనము 158
దశరథ సంకల్పము 159
పౌరజనామోదము 160
యౌవరాజ్యాభిషేకయత్నము 161
దశరథుఁడు రామునకు ముఖ్య రాజనీతులుపదేశించుట 162
కౌసల్యాదేవి పుత్త్రుని క్షేమార్థము భగవంతుని బ్రార్థించుట 163
రాముఁడు నిజయౌవరాజ్యాభిషేక వార్త తల్లికిఁ జెప్పుట 164
రాముఁడు పత్నితోడ నుపవాసవిధి సల్పుట 165
అయోధ్యానగరమును శృంగారించుట 166
విషబీజారోపణము — కైకేయీ మంథరలు 166
విషపరిణామము 173
కైకేయీ ప్రాసాదము 181
కైకేయీ కపటవ్యూహము 182
కైకేయీ దశరథుల సమాగమము 183
దశరథుఁడు కైకేయికి బాసచేయుట 184
కైకేయి వరంబులు గోరుట 187
దశరథుని దుఃఖరోదనములు 187
అభిషేక ద్రవ్యార్జనము 196
కైకేయీ సుమంత్రులు 196
రాముఁడు దశరథునొద్దకుఁబోవుట 198
కైకేయీ రాములు 199
రాముఁడు తల్లిని వీడ్కొనుట 203
కౌసల్యా విలాపము 204
లక్ష్మణుని శోకకోపంబులు 205
రాముఁడు కౌసల్యా లక్ష్మణుల నోదార్చుట 206
రాముఁడు లక్ష్మణుని శాంతి పరచుట 212
కౌసల్యాదేవి పుత్త్రుని దీవించి పంపుట 213
సీతా పతిభక్తిపరీక్ష 217
లక్ష్మణుని పట్టుదల 224
పెద్దలను బూజించి వీడ్కొనుట 226
ప్రదానములు 226
భృత్యవర్గ సన్మానము 227
త్రిజటుఁడు 227
ప్రజాదుఃఖము 228
తండ్రిని వీడ్కొనుట 229
సుమంత్రుఁడు కైకేయికి బోధించుట 232
కైకేయీ దశరథుల వివాదము 233
సిద్ధార్థుఁడు కైకేయిని నిందించుట 234
రామాదులకు వల్కలము లిచ్చుట 234
వసిష్ఠుఁడు కైకేయికి హితము చెప్పుట 235
దశరథుని పరితాపము 236
కౌసల్యాదేవి సీతకు హితముపదేశించుట 237
సీత నిజమనమును వెల్లడించుట 237
రామాదుల నిర్గమనము 237
సీతారామలక్ష్మణుల వనప్రయాణము 238
దశరథుని దురవస్థ 239
కౌసల్యా విలాపము 240
సుమిత్ర కౌసల్య నోదార్చుట 241
రాముఁడయోధ్యావాసుల నూరార్చుట 242
వృద్ధబ్రాహ్మణులు రాముని వెంటఁబడి వేఁడుట 243
వనవాస ప్రథమ వాసరము 244
రాముఁడు పురవాసుల నేమరించి చనుట 245
పౌరులు రామునిగానక యిల్లుచేరుట 245
రాముని వదలివచ్చినందులకుఁ దమ పతులను పౌరస్త్రీలు కోరాడుట 247
రాముఁడు కోసలదేశంబును గడచి చనుట 247
గుహునితోడి సమాగమము 248
గుహలక్ష్మణుల సంవాదము 249
రాముఁడు సుమంత్రుని గుహుని వీడ్కొనుట 250
గంగాతరణము 253
తొలిరాత్రి 254
భరద్వాజాశ్రమము 255
యమునాతరణము 257
చిత్రకూటమున వాల్మీకిని సందర్శించుట 258

పర్ణశాలా ప్రవేశము 258
గుహుఁడు సుమంత్రుని వీడ్కొనుట 259
సుమంత్రుఁడు దశరథుని సందర్శించుట 259
దశరథుఁడు మూర్ఛాగతుఁడగుట 261
కౌసల్యా పరిదేవనము 262
దశరథుని నిర్యాణము 270
జనులు కర్తవ్యమునుగూర్చి పలుకుట 271
భరతునకుఁగా దూతలు గిరివ్రజ పురమునకు జనుట 272
భరతుని స్వప్నము 273
భరతుఁ డయోధ్యకుఁ దరలుట 275
అయోధ్యానగరస్థితి 275
కైకేయీ భరతులు 276
భరతుని శపథము 279
దశరథుని దహనక్రియలు 281
భరత పట్టాభిషేకమును రాజకర్తలు కోరుట 283
భరతుఁడు రాజ్యమును నిగ్రహించుట 284
భరతుఁడు రామునికై తరలుట 285
గుహ భరత సంవాదము 285
భరతుఁడు భరద్వాజ మహర్షిని సందర్శించుట 289
భరద్వాజుఁడు భరతునకు విందొనర్చుట 290
భరతుఁడు చిత్రకూటమునకుఁదరలుట 292
సీతారాముల వనవిహారము 293
రామభరతుల సమావేశము 295
రాముఁడు రాజధర్మముల నుపదేశించుట 298
భరతుఁడు రామపట్టాభిషేకమును ప్రార్థించుట 302
రాముఁడు తండ్రికి జలక్రియలు సలుపుట 303
కౌసల్యాదేవి పుత్రాదుల కష్టములకై దుఃఖించుట 304
రామాదులను వారి తల్లులు చేరుట 305
రామభరతుల సంవాదము 305
రామ జాబాలిమహర్షుల వివాదము 309
చార్వాకమత ఖండనము 312
స్వభావవాద ఖండనము 312
పరమాణువాద ఖండనము 313
సృష్టితత్త్వము 313
పరమాత్మ 313
కారణతత్త్వ విచారము 313
సృష్టిసంకల్ప విచారము 314
కర్మ తత్త్వము 315
శ్రాద్ధవిధి 316
నైసర్గికస్థితి 316
యోగములు 317
మనుష్యుని విశేష ధర్మము 317
యుక్తివాదఫలము 317
సత్యమే ధర్మము 318
రామవసిష్ఠుల సంవాదము 319
భరతుఁడు నిరశనవ్రతమున కుపక్రమించుట 320
దేవతలు భరతునకు హితము చెప్పుట 321
రాముఁడు తన పాదుకలిచ్చి భరతుని పంపుట 322
పాదుకా పట్టాభిషేకము 322
ఋషులు చిత్రకూటమునుబాసి చనుట 323
రాముఁడు చిత్రకూటమును వదలి యత్రియాశ్రమము చేరుట 324
రామాదులు దండకారణ్యమునకుఁ బోవుట 325


## అరణ్యకాండము :


రాముఁడు సీతాలక్ష్మణులతోడఁ దాపసమండలమునకుఁ బోవుట 326
విరాధవధ 327
రాముఁడు శరభంగాశ్రమమునకుఁ జనుట 330
ఆశ్రమమునులు రాక్షసబాధలుగూర్చి రామునకు మొఱలిడుట 331
సుతీక్ష్ణమహర్షి యాశ్రమము 333
సీతారాముల సంభాషణము 335
ధర్మభృన్ముని సందర్శనము 339
రామాదులు మునిపల్లెలో పదియేండ్లు గడపి సుతీక్ష్ణమహర్షి యాశ్రమంబు చేరుట 340
సుదర్శనాశ్రమము 340
ఇల్వల వాతాపులు 341

అగస్త్యాశ్రమము 342
జటాయు సందర్శనము 345
పంచవటి 345
ఋతువర్ణనము 346
శూర్పణఖ 347
జనస్థానము-ఖరాసురుఁడు 348
ఖరుఁడు రామునిపైఁ బదునల్వుర రక్షోవీరులఁబంపుట 349
ఖరుని యుద్ధసన్నాహము 350
దుశ్శకునములు 351
రాముఁడు యుద్ధసన్నద్ధుఁడగుట 352
రాక్షససైన్య సంహారము 353
దూషణ సంహారము 354
ఖరసేనాధ్యక్షుల సంహారము 354
త్రిశిరుని సంహారము 355
ఖరసంహారము 356
అకంపనుఁడు జనస్థాన వృత్తాంతంబును రావణునకుఁ దెలుపుట 359
రావణుఁడు మారీచుని సహాయము గోరుట 360
రావణుఁడు పగదీఱు విధమును నిశ్చయించుట 365
రావణ మారీచుల పునస్సమాగమము 365
మారీచుఁడు రావణునకు మరల హితంబు చెప్పుట 366
రావణుఁడు మారీచుని శాసించుట 368
రావణ మారీచులు రామాశ్రమము వచ్చుట 369
మారీచుఁడు చిత్ర సువర్ణమృగమై సీతాదేవిని ప్రలోభించుట 370
సీతాదేవి మాయామృగంబును తేఁగోరుట 370
రాముఁడు మృగార్థము పోవుట 371
మాయామృగ ప్రతారణము 371
సీతాదేవి లక్ష్మణుని గఠినోక్తులాడుట 372
లక్ష్మణుఁడు రామునికొఱకుపోవుట 373
రావణుఁడు సన్న్యాసి వేషముదాల్చి వచ్చుట 374
సీతాదేవి మాయాసన్న్యాసిని సత్కరించుట 376
మాయాసన్న్యాసి నిజరూపంబుఁ దెలుపుట 377
సీతాదేవి రావణునిఁ దిరస్కరించుట 377
రావణుఁడు సీతాదేవిని హరించుట 378
సీతావిలాపము 379
జటాయువు రావణుల యుద్ధము 381
జటాయువునకై సీతాదేవి దుఃఖించుట 383
దుశ్శకునాదులకు రాముఁడు సంతాపమొందుట 385
లక్ష్మణుఁడు తాను సీతాదేవిని వదలిన కారణముఁ దెల్పుట 386
రామవిలాపములు 386
లక్ష్మణుఁడు రామునోదార్చుట 389
రాముఁడు దుఃఖాతిరేకంబున దారుణోద్యోగి యగుట 389
లక్ష్మణుఁడు రామునితలంపుమార్చుట 391
రాముఁడు సీతాన్వేషియై తరలుట 392
లక్ష్మణుఁడు రామునకు ప్రశాంతి గూర్చుట 394
జటాయువు రామునకు సీతా వృత్తాంతము చెప్పుట 396
జటాయువు దహనసంస్కారములు 397
రావణుఁడు సీతాదేవిని లంకకుఁ దెచ్చుట 398
మతంగాశ్రమము - అయోముఖి 399
కబంధుఁడు 400
సుగ్రీవునితో మైత్రిసేయుమని కబంధుఁడు రామునకుఁ జెప్పుట 402
రావణుఁడు సీతాదేవికిఁ బండ్రెండు నెలలు గడువిచ్చుట 404
రామలక్ష్మణులు శబరియాశ్రమముఁ జేరుట 406
పంపాసరోవర సందర్శనము 407

శ్రీరస్తు

శ్రీ సీతారామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ దొడ్డ రామాయణము

శా. శ్రీమద్దివ్యగృహస్థధర్మముఁ బ్రతిష్ఠింపంగ మర్త్యాకృతిన్
భూమిం బుట్టె నెవండు, ముజ్జగము లేపుణ్యాత్మకుం బాడుచున్
సేమం బందుఁ జతుర్విధార్థముల, నాసీతామనోహారి శ్రీ
రాముం డీవుత మాకుఁ బ్రీతిమెయి నశ్రాంతంబు భద్రంబులన్.

ఉ. అంకిలి లేక కార్యము సమాప్తము నొందెడుపొంటె మున్నుగాఁ
బంకజసంభవాదులు సభక్తికపూజ లొనర్తు రేని కా
శంకరుపట్టి బన్నములసామి దయాపరతంత్రమూర్తి మా
వంకఁ గటాక్షవీక్షణ లవం బొలయించెడుఁగాత నర్మిలిన్.

కం. పంచాశద్వర్ణములఁ బ్రపంచంబున వ్యాప్తిఁ గాంచి పరగెడుతల్లిం
జంచద్విపంచికాసముదంచితపాణిన్ భజింతు నబ్జజురాణిన్.

ఉ. ఆదిఁ గలావతిన్ నుడువునప్పుడు ప్రోడతనంబుఁ బూని యా
మీఁదట మార్దవం బనుగమించి యుగంధరునిన్ వచించి గీ
తాదహరప్రకాశమునఁ దద్దయుసౌమ్యతఁ దాల్చితిప్పు డే
మాదిరి పల్కుదో భువనమంగళమూర్తిచరిత్ర, భారతీ.

ఉ. ఆశయ మొండు వృత్తియన నయ్యె నొకండుగఁ, బూర్వకర్మ మీ
రాశిది యూటఁ జేసి యిరురాజులఁ గొల్చుటయయ్యె నాకు, నా
యాశలు దీఱఁ దావకపదాబ్జసపర్య లొనర్పనైతి నం
చో శుకవాణి! నావలను నూనకువమ్ము పరాఙ్ముఖత్వమున్.

గీ. అరిదిగఁ గవితాశాఖాగ్ర మధివసించి
'రామరామ' యనెడి మధురాక్షరముల
మధురమధురంబుగాఁగఁ దన్మయతఁ బల్కు
ననఘు వాల్మీకికోకిలం బాత్మఁ దలఁతు.

మ. ప్రతిభానిర్మితనూత్నభావమయసామ్రాజ్యం బధిష్ఠించి శా
శ్వతులై ప్రాకృతజీవలోకశుభకాంక్షన్ సద్రసాసార సం
తతధారల్ గురియించి యక్షయమహానందంబు నశ్రాంతముం
బ్రతిపాదించెడి సంస్కృతాంధ్రసుకవిబ్రహ్మల్ సనుం బ్రోచుతన్.

చ. అనుపమ చిత్తశుద్ధినిరుపాధికభక్తియుఁ దోఁచు నిల్వ నే
యనఘుఁడు దాఁటె రామచరితాంబుధి సర్వజగన్నుతంబుగాఁ.
బ్రణతజనార్తిహారియు శుభప్రతిపాదియు నేమహాత్ముఁ డా
యనిలతనూజుఁ డీవుత ననంతదయామతి వాంఛితార్థముల్.

చ. ఎవనిసపర్యలం దలఁచి యెంతయువందురు నాంధ్రవాణి యా
ప్రవిమల ధీవిశారదుని బండితవర్యు రసౌచితీ రహ
స్యవివరణాద్వితీయుని గుశాగ్రమతిన్ భజియింతు మద్గురున్
వివిధ కళాప్రపూర్ణు నల వేదము వెంకటరాయశాస్త్రులన్.

చ. పటుతరవాగ్మి యంచుఁ బ్రతిభాప్రథితుం డని యూర్తకోటికిం
బటువగు మాతకొమ్మయనఁ బ్రస్తుతిఁగన్న రసజ్ఞమౌళిఁ బ్రా
కట కవితావినోది బుధగణ్యుని శ్రీయుత తూములూరు వేం
కట శివరామమిత్రమణి గాటపుఁగూర్మి దలంతు నిచ్చలున్.

ఉ. కేవల రామభక్తి పలికించినవైఖరి నిమ్మహాకృతిన్
ధీవరులార! వ్రాయుటకుఁ దెంపు వహించితి నంతె గాని ప్ర
జ్ఞావిభవంబుఁ జూపుటకుఁగాదు; రసంబుగ్రహించి పేర్మి దో
షావళి నుజ్జగింపనగు హంసలు క్షీరము నీరముం బలెన్.

ఉ. ఆయతభక్తి నీదుచరణాబ్జములన్ మదినిల్పి నొడ్డ రా
మాయణమంచుఁ బేరిడి యమానుషకంబగు నీచరిత్రమున్
వ్రాయఁగఁ బూనితిం దెలుఁగువాక్యముగాఁ గడుఁదెంపు సేసి, రా
మా! యెటు లీమనోరథము మన్నన చేయుదువో దయానిధీ!

ఉ. గీతలసేవచేతను జిగిర్చిన చిత్తముఁ బెంపుగాంచెఁగా
నాతతభక్తిమూలభవదంఘ్రుల చల్లనినీడవైచి నా
చేతులు గూర్చితిం గరుణఁ జేకొని ప్రోవుము రామచంద్ర! యా
సీతను వాయునందనుని జిష్ణువిభీషణుఁ గన్నకూర్మితోన్.

ఉ. నీ వవతార మెత్తుటయె నిక్కముగాదఁట, మానికల్పనో
జీవితచిత్రమూర్తివఁట, చెల్లరొ! సాధ్యమె నిన్నుఁ గాంచ దో
షావిలకర్మబద్ధజనుపాంథులకున్ బహిరాంతరాత్మలీ
లావిభవాభిరాము సకలస్థితిమూలము, రామభద్రకా?

చ. అనృతముఁ బల్కు నన్న ముని యమ్యోను డక్కురి, కల్పితుండవై
తనరితి వీవు, నీదుచరితల్ ముసలమ్మలసుద్దు లయ్యె, ని

న్న నయముగొల్చుటయ్యొ హృదయంబును గ్రమ్మినదుర్బలంబహో!
కన నగుఁగాదె యుండె కలికాలవిశేషము రామభద్రకా!

ఉ. అంతరమందు నీదు మధురాకృతి నిల్పి నిరంతరంబు నై
కాంతికభక్తి చేయు మహితాత్ముల కెల్లను దోడునీడవై
చెంతఁ జరించుచుండుదువు సిద్ధము సుమ్మిది వక్రబుద్ధు ల
త్యంతము నిన్ను లేదనినయంతనె చెల్లునె? రామభద్రకా!

ఉ. తొల్లిటిగాథ లేల? యల తుర్కఁ గబీరుని రామదాసునిన్
దల్లయుఁడైన యా తులసిదాసుని నమ్మఁగరాదె? వారలు
న్గల్లరులంచుఁ బల్కునవనాగరకాగ్రణులున్న నుండనీ;
చెల్లరొ! యంతమాత్రనె నశించునె సత్యము? కల్లనిల్చునే?

మ. చనెఁబో నేఁబదియేడువర్షములు నాజన్మాది, నెన్నాళ్ళు భూ
మిని నున్నన్ ఫలమేమి? యిట్టిబ్రదుకుల్ మిథ్యావినోదక్రియా
విని యోగాత్మకనాటకంబులుగదా, విశ్వేశ్వరున్ నిన్నుఁ గా
ననినాఁడింతటనేనిఁ దీర్పఁగదవే నాకోర్కె సీతాపతీ.

సీ. సిరిసంపదలఁగోరి సేవింపఁగా లేదు
ప్రారబ్ధమును ద్రోయరాదుగానఁ
పేరుప్రతిష్ఠకై పెనఁగులాడుట లేదు
వర్తనంబును బట్టివచ్చుఁగాన,
భార్యాసుతులమేలు ప్రార్థింపగా లేదు
వారు నీవారలై వఱలుఁ గాన
అద్వైతసిద్ధికై యాసింపఁగా లేదు
ద్వైతవాసనయింకఁ దనరుఁగాన,

గీ. చిత్తమేప్రొద్దు నీయందె స్థిరతగాంచి
నీకథామృతపానైకనియతిఁ గల్గి
తావకేచ్ఛానుసారినై తరలునట్లు
ప్రేమతోఁ బ్రసాదింపుము రామచంద్ర.

శ్రీ సీతారామాంజనేయార్పణమస్తు.

# శ్రీ దొడ్డరామాయణము

## పూర్వకాండము

చ. అవసర మైనయప్పుడు స్వయమ్ముగ నేఘనుఁ డాత్మమాయచే
నవతరణంబు నొంది దురితాత్ములదుర్భరబాధనుండి యీ
భువనముఁ బ్రోచు నప్పరమపూరుషు నాద్యు ననంతు నప్రమే
యవిభవు సర్వలోకసముపాశ్రయు దీనదయాళుఁ గొల్చెదన్.

### విశ్రవసు జననము

తొల్లి కృతయుగంబునఁ బ్రజాపతికిఁ బులస్త్యుఁడను సుతుఁ డుండెను. అతఁడు సర్వసుగుణసంపన్నుఁడై ధర్మమునుబట్టిగాని శీలమును బట్టిగాని సాక్షాత్ప్రజాపతియే యని పొగడొందుచు దేవతలకెల్ల వల్లభుఁడై సర్వలోక ప్రియుఁడుగా నొప్పెను.

ఆ పులస్త్యుఁడు ధర్మపరత్వంబునం జేసి మేరుపర్వతంబునకుఁ జని యందుఁ దృణబిందువను పేరి యాశ్రమంబున వసించుచు స్వాధ్యాయ నియతేంద్రియుఁడై ఘోరతప మొనర్పసాగెను.

ఆ ప్రదేశము సర్వఋతువులందు రమ్యము నుపభోగ్యమునై యుండుటం జేసి యటకు దేవకన్యకలును బన్నగాంగనలును రాజర్షి తనయలును జని క్రీడించుచుండిరి. ఆ మహిళారత్నముల మధుర గానాలాపంబులును నృత్యగీతంబులు నత్తపస్వికి విఘ్నకారులై తోఁచెను. అతఁ డందులకుఁ గోపించి, 'ఎవతె యిటకు వచ్చి నాకంటఁ బడునో యా యింతి సద్యోగర్భవతి యగుఁగాక' అని శపించెను. ఆశాపంబును విని భయపడి నాఁటనుండి ఆ కన్యలటుఁజనుట మానిరి.

ఆ కాలంబునఁ దృణబిందు వనురాజర్షి గలఁడు. వాని కొక పుత్త్రిక యుండెను. ఆ కోమలి యీ శాపంబు నెఱుంగక యథాపూర్వము నాఁడుగూడ నయ్యాశ్రమ ప్రదేశంబునకుఁబోయి యందుఁ గొంతవడి విహరించుచుండెను. ఎంతసేపున్నను సఖు లెవ్వరు నటు

రారైరి. కారణ మేమోయని యాపూబోఁడి తలపోయసాగెను. అంత లోన స్వాధ్యాయధ్వని శ్రవణోల్లాసముగా వినవచ్చెను. ఆ వేదశ్రుతి యెందుండి వచ్చెనో యెఱుఁగ వేడుకపడి యా కాంతామణి యావంకఁ గొంతదూరము పోయెను. అటఁ బులస్త్యఋషి యుండెను. వానినిఁ జూచుటే తడవుగా నామె దేహము వైవర్ణ్యముఁ జెందెను; ఆమెకు గర్భచిహ్నము లుదయించెను.

ఆ బాలామణి తద్విపరీతంబునకు సముద్విగ్నమానసయై, 'కటా! ఏ దోషంబున నిట్టిది సంభవించెనో'యని చింతించుచుఁ దండ్రి యాశ్రమంబునకుఁబోయి వానియెదుట నిలిచెను. తృణబిందువు తనపట్టిని జూచి, 'పుత్త్రీ నీ శరీర మిట్లు గానేల' అని యడిగెను. 'తండ్రీ, కారణ మేమో తెలియరాదు. పులస్త్యమహర్షి యాశ్రమంబునకు నా చెలుల కొఱకుఁ బూర్వపురీతిఁ జనితిని. అటకు నాసఖులెవ్వరును రారైరి. అంతలోన వేదశ్రుతి చెవిఁబడెను. ఆవంకకు జని యటఁ బులస్త్య మహర్షిని జూచితిని; వెంటనే నా రూప మిట్లు విపర్యాస మొందెను; భయపడి యిందువచ్చితి' నని యామె చెప్పెను.

తృణబిందువు వృత్తాంత మెల్ల విని ధ్యానగతుఁడై దివ్యదృష్టి చేత సమస్తము గ్రహించి వివరంబును బుత్త్రికకుఁ దెలిపి యామెను వెంటఁగొని పులస్త్యమహర్షి యొద్దకుఁ బోయి, 'మహాత్మా, ఈ బిడ్డ నా పుత్త్రిక. సుగుణభూషణభూషిత; ఈమెను నీకు సమర్పించు చున్నాను గ్రహింపుము. తపశ్చరణయుక్తుండవును శ్రాంత్యమానసేంద్రి యుఁడవు నైన నీకు నాసుత శుశ్రూష లొనర్చుచుండు' నని పలికెను. పులస్త్యుఁడు వల్లెయనెను. అంతఁ దృణబిందువు తనపట్టిని వానికి యథాశాస్త్ర మర్పించి నిజాశ్రమంబునకుఁ బోయెను.

ఆకన్య యందుండి పులస్త్యుని శుశ్రూషించుచు స్వగుణంబుల వాని మదికెక్కి వర్తించుచుండెను. ఆమునిపుంగవుఁ డామె శీలవృత్తంబు లకు సంతోషించి, 'సుశ్రోణీ, నీగుణసంపద కెంతయు నానందించితిని. ఆత్మసదృశుఁడైన పుత్త్రుని నీకుఁ బ్రసాదించితిని. ఉభయవంశంబులకు నతఁడు కర్తయై పౌలస్త్యుఁ డనుపేరఁ బరగును. మఱియు నేను వేదాధ్యయనము చేయుచుండఁగా నీవు వింటివి గావున నీగర్భసంజాతుని విశ్రవసువనియుఁ బేర్కొందురు' అని చెప్పెను. ఆమె ప్రహృష్టాత్మ యయ్యెను. అంతఁ గొన్నాళ్లకు విశ్రవసువు జనించెను. అతఁడు

పుట్టువుఁదొట్టి యశోధర్మంబులఁ బాయక సమస్తవేదంబు లధ్యయనించి వ్రతాచారరతుఁడును సమదర్శియునై తండ్రివలెనే తపంబాచరించి ముని యయ్యెను.

## వైశ్రవణ వృత్తాంతము

విశ్రవసుఁడు సత్యసంధుఁడై శీలముఁ బాయక మూర్తిగొన్న శాంతమట్లు తేజరిల్లుచు శుచియు స్వాధ్యాయనిరతుఁడును సర్వభోగ విముఖుఁడును నిరంతరధర్మపరాయణుఁడునై యుండుట భరద్వాజ మహర్షి యెఱిఁగి పరమప్రీతుఁడై దేవవర్ణి యను తనపుత్త్రికను వాని కిచ్చి వివాహ మొనర్చెను. వారికి సుతుఁ డొకఁ డుదయించెను. ఆ బాలుఁడు శైశవంబునందే బ్రహ్మగుణయుతుఁడగుటకుఁ బితామహుఁడు సంతసించి వాని భవితవ్యమునకుఁ బోలునట్లుగా ధనాధ్యక్షుఁడను పేరు వానికిడెను. మఱియు నతఁడు తండ్రి నెల్లవిధంబులఁ బోలుటం జేసి వానిని వైశ్రవణుఁడనియు వచించిరి.

ఆ వైశ్రవణుఁడు తపోవనగతుఁడై 'సత్యం హి పరమం ధర్మం ధర్మో హి పరమాగతిః' అని నమ్మి నియమము వహించి ధర్మ మాచరించుచు సహస్రవర్షంబులు తపంబు సలిపి స్నాతుఁడై జలాశిగాఁ గొంత కాలము, వాయుభక్షణుఁడై కొంత కాలము, నిరశనవ్రతంబూని కొంత కాలము, నిట్లు మఱల వేయి సంవత్సరంబులు పుచ్చెను. ఈవర్ష సహస్రము వానికొక్క వర్షమాత్రంబుగాఁ గడచెను. బ్రహ్మ వానికి మహాప్రీతుఁడై యింద్రాదిసురగణపురస్సరంబుగాఁ దదాశ్రమంబునకు వచ్చి 'వత్సా, నీకు మెచ్చితిని; శుభమగుఁగాక; వరముఁ గోరుము; వరములకుఁ బాత్రుఁడవుసుమా' యనెను.

వైశ్రవణుఁడు పరమేష్ఠికి నమస్కరించి, 'దేవా, లోకపాలన విత్తరక్షణాధికారంబులను వరింతు' ననెను. బ్రహ్మయు సంతసించి, 'వత్సా, అట్లే యగుఁగాక. లోకపాలకత్వంబునకై యింద్రయమ వరుణు లనువారిని ముగ్గురను సృష్టించి నాల్గవవాని నిర్మాణంబును సంకల్పించియున్నాను. నీవే యతఁడవై నిధీశత్వముఁ బడసి యుండు' మని పలికి సూర్యసన్నిభమైన పుష్పకవిమానంబునిచ్చి 'వత్సా, ఈ విమానరాజంబును గైకొని దేవతాసముఁడవై సంచరించుచుండుము. నీకీ వరద్వయం బిచ్చి కృతకృత్యులమైతి' మనుచుఁ ద్రిదశులతోడ స్వస్థానంబునకుఁ బోయెను.

## వైశ్రవణుఁడు లంకాపతియగుట

బ్రహ్మాదులు చన్నంతనే వైశ్రవణుఁడు తన తండ్రియొద్దకుఁ బోయి వానికి మ్రొక్కి యుదంతమెల్ల విన్నవించి, 'పరమేష్ఠి యిష్టవరంబుల రెంటి నిచ్చి చనెను. ఎందు నేను వసింప నగునో వాని నడుగ మఱచితిని; ఆయనయేని నా నివాసస్థల మిది యని నిర్దేశింపఁడయ్యెను. తగు చోటు నిర్ణయింపుము. ఎచ్చట నే నున్నచో నావలనఁ బ్రాణులకుఁ గించిన్మాత్రమేనియు బాధ కలుగకుండునో యట్టి తావును నిశ్చయింపు' మని కోరెను. విశ్రవసుఁడు సుతునకు సంతసించి పర్యాలోచించి, 'నాయనా, దక్షిణసముద్ర తీరంబునఁ ద్రికూట మనుపర్వతము గలదు. ఆనగంబుమీఁద నమరావతిని బోని పురవరంబు లంక యనునది యున్నది. ఆనగరరత్నంబును దొల్లి విశ్వకర్మ రాక్షసనివాసార్థము నిర్మించెను. సువర్ణప్రాకారపరిఘావలయితంబును రుక్మవైడూర్యతోరణవిరాజితంబును సమస్తయంత్రశస్త్రసంపూర్ణంబునై శోభిల్లు నప్పురంబున రాక్షసులు నివసించుచుండి కొండొకనాఁడు విష్ణువలని భయంబునం జేసి దానిని వదలి రసాతలము నాశ్రయించిరి. నాఁటఁగోలె నది శూన్యముగా నున్నది. దానికి జేఁ డెవ్వఁడును గలుగఁడు. నీ వందు సుఖముండుము. ఆచోటు నీకోరికకు సరిపోవు' నని చెప్పెను.

## రాక్షసోత్పత్తి కథనము

నావుడు, 'నాయనా, ఈరాక్షసు లెవ్వరు? వారి పుట్టుపూర్వము లేమి? విష్ణువలనిభయము వారికేల దాపరించె' నని వైశ్రవణుఁ డడిగెను. విశ్రవసుఁ డిట్లనియె. 'వత్సా, తొల్లి ప్రజాపతి జలంబులను సృజించి తద్రక్షణార్థము జలజంతువులను బుట్టించెను. ఆ సత్త్వములు సృష్టికర్తను జూసి 'క్షుత్పిపాసార్దితులమైతిమి; ఏమి చేయ నగు'నని వినీతవిధంబున నడిగెను. అది విని ప్రజాపతి నవ్వులాటకుంబోలె 'రక్షధ్వ' మనెను. ఆమాట విని 'రక్షామ' అని కొన్ని 'జక్షామ' అని కొన్ని అచ్చుపెట్టెను. బ్రహ్మ కోపించి 'రక్షామ' అని యన్నవి రాక్షసులుగా, 'జక్షామ' అని యన్నవి యక్షులుగా నగునట్లు శపించెను. ఆ సత్త్వము లట్లాయెను.

## హేతిసంతానము

'అందు హేతి ప్రహేతి యనువా రిరువు రన్నదమ్ములు, మధుకైటభులతో నెన సేయఁదగినవారుండిరి. వారిద్దఱు రాక్షసులకు రాజు

లైరి. అందుఁ బ్రహేతి యనువాఁడు ధార్మికుఁడు ; దానంజేసి యతఁడు తపోవనంబునకుఁ బోయెను. హేతియనువాఁడు భార్యార్థియై ప్రబల ప్రయత్న మొనర్చి తుదకు శమనుని చెల్లెలు భయ యను కన్యను బెండ్లాడి యా యింతివలన విద్యుత్కేశుఁడను సుతునిఁ బడసెను. ఆకూన దీప్తార్కసమ తేజస్సమేతుఁడై పెరిగి కాలక్రమంబున సంప్రాప్త యౌవనుఁడయ్యెను. హేతి వానికిఁ బెండ్లిసేయ సంకల్పించి సంధ్యా సుతను దనపుత్త్రునకుఁగా వరించెను. ఆఁడుబిడ్డ నెవ్వనికైన నొకనికిఁ గూర్పక తప్పదు గావున సంధ్య యందులకు నియ్యకొని తన కూఁతును సాలకటంకట యనుదానిని విద్యుత్కేశున కిచ్చి వివాహ మొనర్చెను. ఆతఁడు భార్యంగూడి యింద్రుఁడు శచీదేవితోడ బోలె సుఖంబులు చూఱగొనుచుండెను.

## సుకేశ జననము

'ఇట్లు కొంతకాలము జరుగఁగా సాలకటంకట చూలు దాల్చి మందరపర్వతంబునకుఁ జని యట శరత్కాలసూర్యతేజస్వియగు పుత్త్రుని, గంగ యగ్నిజగర్భంబునుబోలెఁ బ్రసవించి పతిమీఁదివిరాళింజేసి యాబుడుత నంటేఁ డించి భర్తను జేరి వానితోడ యథాసుఖము విహ రింప సాగెను. ఆకూన యందే తల్లికై పనవుచుండెను.

'ఇట్లుండఁ గొండొకనాఁడు పార్వతీపరమేశ్వరులు వృషభ వాహనారూఢులై వాయుమార్గంబునఁ జనుచుండఁగా వారికి శిశురోదన మొండు వినవచ్చెను. బిడ్డయేడ్పు చెవి సోకినంతనే పార్వతికి జాలి జనించెను. మహాదేవుఁ డది గ్రహించి సతికిఁ బ్రియముఁ గూర్చు వాఁడై యా శిసువునకు నమరత్వమును దల్లిప్రాయంబు నిచ్చి గగన చారియగు పురంబొండు ప్రసాదించెను. ఉమయును నబ్బాలుని దురవస్థకు రక్కసుల కామోద్వేగము కారణముగా నెఱిగి యాజాతి కట్టిది సహజంబగుట గ్రహించి 'అసురులకు సద్యోగర్భప్రాప్తియు సద్యః ప్రసవంబును వారిశిశువులకు సద్యోవయస్సిద్ధియు' నగుఁగాక యనెను. నాఁడుసుత యట్లే జరుగుచున్నది. ఆ బాలుఁ డట్లు పార్వతీపరమేశ్వరుల వరంబుల కల్మింజేసి గర్వించి సుకేశుఁ డను పేర నొప్పి యంబరచరపురం బధిష్ఠించి సర్వగామియై విరాజిల్లెను.

'ఆ సుకేశుఁ డట్లు ప్రాప్తవరుఁడై యుండుట గ్రామణి యను గంధర్వుఁడు విని వానికి నిజసుతను దేవవతియను దాని నిచ్చి పెండ్లి

యొనర్చెను. త్రైలోక్యవిఖ్యాతరూపయౌవనశాలిని యైన యా దేవవతియు వరదానకృతైశ్వర్యుఁడగు పతిని బొంది నిర్ధనుఁడు ధనప్రాప్తికిం బలె సంతోషించెను. సుకేశుఁడును సతితోడిదే లోకంబుగా నుండెను.

## మాల్యవదాదుల చరిత్ర

'ఆ దేవవతీసుకేశులకు మాల్యవంతుఁడు సుమాలి మాలి యను పుత్త్రులు మహాబలపరాక్రమశాలులు ముప్పురు త్రేతాగ్నిబోనివారు జనించి ముక్కంటికి సములై మంత్రత్రయంబుక్రియ నత్యుగ్రరూపంబులు దాల్చి దోషత్రయమునలె మహాఘోరులై పెరుఁగుచుండిరి. ఇట్లుండఁ గొండొకనాఁడు వారు తమతండ్రి యీశ్వరు నారాధించి వరంబులు పడయుట విని, కృతనిశ్చయులై మేరుపర్వతంబునకుఁ బోయి యందు ఘోరనియమంబుతో సర్వభూతభయావహంబుగాఁ దపం బొనర్ప సాగిరి. వారి తపస్తాపంబునకు ముజ్జగంబులు సదేవాసురమానుషంబుగా నుడ్డుడికెను. చతుర్ముఖుఁడు తత్తఱిల్లి త్రిదశసమేతంబుగా హుటాహుటిఁ వారిదగ్గఱకు వచ్చి, 'తపోవరులారా, మీకు మెచ్చితిని; వరము గోరు' మనెను. వారు నలువకు మ్రొక్కి, 'స్వామీ, మాతపస్సును మెచ్చి వర మీయవచ్చితివేని, అజేయత్వముఁ జిరజీవంబును గలిగి మేము ముప్పురము నొండొరుల ననుసరించి సుఖముండునట్లుగా ననుగ్రహింపు' మనిరి. చతురాస్యుఁడు వారికిఁ గోరినవర మిచ్చి చనెను.

'అంత మాల్యవదాదులు ముప్పురు బ్రహ్మవరగర్వోద్ధతులై సురాసురులను బట్టి బాధింపసాగిరి. దేవర్షిచారణాదులెల్లరు వారినుండి కాపాడు రక్షకుని గానక నిరయంబందిన నరులగతి ననుకరించిరి. మఱియు వారు ముగ్గురట్లు నిరంకుశవర్తనులై చరించుచుఁ గొండొక నాఁడు విశ్వకర్మ యొద్దకుఁజని 'శిల్పివరేణ్యా, ఓజస్తేజోబలంబుల మీకు సాటి గలుగరు. దేవతలకు వారు కోరిన గృహంబులను స్వశక్తి వలన నిర్మించి యిచ్చితివి. మాకుఁగూడ నట్టిది యనుగ్రహింపుము. హిమాద్రియందో మేరునగమందో మందరగిరియందో వసింపఁగోరుదుము. నీవు మాకుగా నిర్మించుగృహంబు మహేశ్వరుని గృహంబునకు దీటుగా నుండనోపు' ననిరి.

## లంకానిర్మాణ చరిత్ర

'విశ్వకర్మ వారి యభిమతంబును విని, 'వత్సలారా, దక్షిణ సముద్రతీరంబునఁ ద్రికూటపర్వతము గలదు. దాని నడిమిశిఖరము

మిన్నొరయుచుండును. ఆ శిఖాగ్రంబును బక్షులు సయితము డాయ నేరవు. అందుఁ దొల్లి మయుఁడు దేవేంద్రుని ప్రీత్యర్థము లంకయనుపేరి పురమొండు నిర్మించెను. ఆ పట్టణము నూఱుయోజనంబుల నిడివియు ముప్పది యోజనంబుల వెడల్పును గలిగి స్వర్ణప్రాకారంబులతో హేమ మయ తోరణంబులతో నొప్పారుచుండును. ఆ నగరము మీ కెంతయు నివాసయోగ్యము. అచ్చట నున్న మిమ్ము శత్రువులు తలఁపుతోనేని చెనకనోపరు' అని చెప్పెను. మాల్యవదాదు లది విని మహాసంతోష మంది మర్యాదతో వానిని వీడ్కొనివచ్చి వేలకొలఁది యనుచరులను వెంటఁగొని చని లంకాపురము చొచ్చి యందుఁ గాపురము చేరిరి.

## మాల్యవదాదుల వివాహాదికము

'ఆ కాలంబున నర్మదయను గంధర్వాంగన యొకతె యుండెను. ఆ యింతికి సుందరి, కేతుమతి, వసుధయను పుత్రికలు మువ్వురు రూపలావణ్య వయోవిలాసంబుల శ్రీధికీర్తులకు నుద్దియైనవా రుండిరి. నర్మద యా మువ్వురను జ్యేష్ఠానుక్రమంబుగా మాల్యవత్సుమాలి మాలి యను మువ్వురకు నిచ్చి యుత్తరఫల్గునీనక్షత్రంబునఁ బరిణయ మొన ర్చెను. అందు సుందరి మాల్యవంతునకు వజ్రముష్టి విరూపాక్షుఁడు దుర్ముఖుఁడు సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁడు మత్తోన్మత్తుఁడు అను కుమారులును అనల యను పుత్రికయు జనించెను. సుమాలి కేతుమతి యందుఁ బ్రహస్తుఁడు అకంపనుఁడు వికటుఁడు కాలకార్ముకుఁడు ధూమ్రాక్షుఁడు దండుఁడు సుపార్శ్వుఁడు మహాబలుఁడు సంహ్రాతి ప్రఘసుఁడు భాసకర్ణుఁడు అను కొడుకులను; రాక, పుష్పోత్కట, కైకసి, కుంభీనసి అను కుమార్తెలను బడసెను. వసుధకు మాలివలన అనిలుఁడు, అనలుఁడు, హరుఁడు, సంపాతి యనువారు పుట్టిరి. మాల్యవ దాదు లట్లు సంతానములతోడను బెక్కండ్రు నిశాచరులతోడను గూడి సమధికరాజ్యశ్రీవిభవోన్నతు లనుభవించుచు మృత్యు ప్రతి మాన తేజంబుల నొప్పారుచు రణరంగంబుల దురాసదులై వరగర్వోద్ధతి విజృంభించుచుఁ గ్రతుక్రియలకు నాఁకవెట్టి సురలను మర్దించుచు ఋషులకుఁ గీడొనర్చుచు నాగయక్షాదులను బహుభంగుల బాధించుచు నిరంకుశ వృత్తిఁ ద్రొక్కిరి.

## దేవతలు శివుని శరణేల్లుట

'ఆ రక్కసుల దుండగంబులను సహింపలేక భయార్తులై దేవతలును ఋషులును గుమికూడి దేవదేవుఁడగు మహేశ్వరునొద్దకుఁ బోయి 'దేవా, ఆదిమధ్యాంతరహితా, అవ్యక్తరూపా, సర్వలోకాధారా, జగదేకసమారాధ్యా, త్రిపురాంతకా, త్రిలోచనా, శరణు! శరణు! సుకేశుని పుత్త్రులు బ్రహ్మవరోద్ధతులై మమ్ము మహా కష్టంబులపాలొనర్చుచున్నారు. మా యిండ్లును మా యాశ్రమంబులును సర్వము నాశనమయ్యెను. స్వర్లోకంబునుండి దేవతలు వెలసపోయిరి; నాకము రాక్షసలోకమునకుఁ గ్రీడామందిర మయ్యెను. నేనే విష్ణుఁడను నేనే రుద్రుఁడను, నేనే బ్రహ్మను అని పేర్వారఁ బల్కుచు నందులకుఁ దలలూఁపనివారిని వారు కాలఁదన్ని నేలరాయుచున్నారు. దేవా, అభయమిచ్చి మమ్ము రక్షింపుము. నీవు శివస్వరూపంబును వదలి రూపాంతరంబు గ్రహించినఁగాని వారు సమయరు' అని మొఱ్ఱవెట్టిరి. సకలలోకహితుఁడు వారి ప్రణయంబులు విని, 'దేవతలారా, మాల్యవదాదులను బరిమార్ప నాతరము గాదు. అందులకు శ్రీ మహావిష్ణువు దక్క యొరులు చాలరు. మీరెల్లరును మహర్షి పురస్కృతంబుగాఁ జని యా దీనరక్షకుని పాదంబుల వ్రాలుఁడు. ఆజగత్ప్రభువు వారిని మాపుమాపి మీయార్తి యుడుపు' ననెను.

## దేవతలు విష్ణుని శరణేల్లుట

'అంత దేవతలు మహేశ్వరునకు జయంబులు పలికి నిశాచర భయార్దితులై వెనువెంటనే విష్ణువును డాసి ప్రణమిల్లి. 'దేవా, శంఖచక్రధరా, సుకేశుని కొడుకులు ముగ్గురు మాల్యవదాదులు వరదానబలంబునం జేసి యెవ్వారినిఁ జెరికి కొనక త్రేతాగ్నులకరణిఁ బ్రజ్వరిల్లుచు మాస్థానంబులెల్ల నపహరించిరి. దిక్కెడ మేము దిమ్మరులమైతిమి. ఆ మాల్యవదాదులు త్రికూటశిఖరంబునందలి దుర్గమంబగు లంకాపురంబున నున్నారు. అందుండి వారు మమ్ముఁ గావించు గాటియలకు మేర లేదు. మధుసూదనా, నిన్ను శరణేల్లితిమి. నీవే మాకు దిక్కు. మదోద్ధతులైన యారాక్షసులను సానుబంధంబుగా భాస్కరుఁడు నీహారమట్లు నీవు హరించునందాక మాభయంబులు తీఱవు. మాయెడఁ బ్రసన్నుఁడ వగు' మని విన్నవించిరి.

'జనార్దనుఁడు వారి దీనాలాపంబులు విని కనికర మూని, 'సుర లారా, ఇఁక మీరు భయంబులు మానుఁడు. సుకేశునిపుత్త్రులు మాల్యవదాదులు నాకుఁ దెలియనివారు కారు. వరదర్పితులై మట్టు మీఱియున్న యా తులువలను సంహరింతు' నని పలికెను. దేవతలంత సంతుష్టులై విష్ణువునకు మ్రొక్కి తమతమ తావులకుఁ జనిరి.

## మాల్యవదాదుల మంతనములు

దేవతలప్రయత్నంబుల నెల్ల మాల్యవంతుఁడు విని తమ్ములను జీరి, 'సోదరులారా, వింటిరా దేవర్షుల జతనంబులు? వారు మనచావుఁ గోరి శంకరునకు మొఱలిడిరి. ఆ పని తనవలనఁగాదని యా యంధకారి చెప్పెను. గత్యంతర మేమని వాని నడిగిరి. శ్రీమన్నారాయణుని శరణెల్లు మని ముక్కంటి యుపాయము బోధించెను. వారు నట్లే యొనర్చిరి. ఆ వైకుంఠుఁడు సురలకు నభయమిచ్చి, మనవధను బ్రతిజ్ఞ చేసెను. కర్తవ్యము నాలోచింపుఁడు. నిర్జరులను భర్జించిన కారణంబున హిరణ్యకశిపుఁడును నముచియుఁగాలనేమియు వీరసత్తముఁడైన సంహ్రా దుఁడును బహుమాయియు రాధేయుఁడును యమళార్జునులును హార్దిక్యుఁ డును శుంభనిశుంభులును దదితరులును మహాబలపరాక్రమవంతులయ్యు సర్వాస్త్రకుశలులయ్యు నారాయణునివాతఁబడి వేనవేలుగా మన పూర్వులు మడిసిరి. జనార్దనుఁడు మనకు ఆవంశవైరి యనుమాట మఱి యొక ప్రకృతము విచారింపనగును. వానిని జయించుట కష్ట' మని చెప్పెను.

'ఆమాటలెల్ల మాలియు సుమాలియు విని, 'అన్నా, వ్యాధి మరణంబులు మనకుఁ గలుగవు. ఇది బ్రహ్మవరము. విరించిపలుకు తప్పదు. ఆ వరమహిమంబునంజేసి యక్షోభ్యమైన దేవసాగరంబుఁ జొచ్చి కొల్లలాడితిమి. ఇంద్రుఁడు దిక్కులు ప్రాఁకెను. రుద్రునిమాట నీవే వచించితివి. నారాయణుఁడా? అతఁడేపాటి? యముఁడంతటివాఁడే మన మ్రోల నిలువనోపఁడనఁగా విష్ణువు గిష్ణువుఁ జెప్పనేల? అదటుండనిమ్ము. విష్ణువునకు మనము గోరంత యపకారమైనను జేయలేదు. అతఁడు మనలను ద్వేషింపనేల? దేవతల దీనాలాపంబులకు మది చలించి వారి నోదార్చుటకుగా నతఁడట్లనియుండును. అన్నిటికి దేవతలే కారకులుగా నున్నారు. ఆ య్యమరులను బరిమార్చుదము. అంతతో వైరబీజము సమసిపోవు' ననిరి. మాల్యవంతుఁడును నట్లె యనెను.

## రాక్షసుల దండయాత్ర

'క్షణములోన రాక్షససేనవాహిని వెల్లివిరిసెను. స్యందనంబు లధిష్ఠించి కొందఱును, గిరిసన్నిభములైన వారణంబు లెక్కి కొందఱును, బవనజవంబుగల హయంబులమీఁదఁ గొందఱును, ఖరంబులారోహించి కొందఱును ఉష్ట్ర వృషభ శింశుమార భుజంగమ మకర కచ్ఛప మీన విహంగంబుల పయిఁ గొందఱును, సింహ వ్యాఘ్ర వరాహ సృమర చమరీ మృగంబులమీఁద మఱికొందఱును, రాక్షసపుంగవులు దాడి వెడలిరి. మాల్యవదాదులు వారిని వెంటఁగొని మొట్టమొదట యముని దెసకు నడచిరి.

'రాక్షసు లట్లు యుద్ధోత్సాహులై నగరు వెడలినంతనే లంకా ధిష్ఠాన భూతంబులెల్ల విమనస్కము నొందెను. భౌమంబులు నాంతరి క్షంబులు నైన నిమిత్తంబులు భయావహముగాఁ దోఁచెను; అస్థి మేధ శ్శోణితంబులు వర్షించెను; సముద్రము చెలియలికట్ట నతిక్రమించెను; పర్వతంబులు చలించెను; మేఘనిర్ఘోషాట్టహాసంబు లుప్పతిల్లెను; నఱఁ డులు దారుణంబుగాఁ గూసెను; భూతంబులు రాలసాగెను; గృధ్రంబులు మంటలు గ్రక్కుముఖంబులతోఁ బిండుగట్టి మింటఁ జరించెను; గగన తలంబునుండి కొఱవులు రక్కసులపైఁ గురిసెను; శారికాకపోతంబులు విద్రుతంబుగాఁ బఱచెను; కాకబిడాలంబు లుద్భటారావంబులు గావించెను.

'అట్లు భౌమాంతరిక్షనిమిత్తంబులు మహాభయావహముగాఁ దోఁచినను రాక్షసులు బలగర్వోన్నతిం జేసి యా యుత్పాతంబుల లెక్క సేయక మృత్యుపాశబద్ధులై యీడ్వఁబడువారుంబోలె నిలువక చనిరి. వారి సముద్యోగంబును దేవదూతలవలన నారాయణుఁడు విని యుద్ధ సన్నద్ధుఁడై యాయుధతూణీరంబులు సంతరించి కోటిసూర్యప్రకాశమైన దివ్యకవచంబుఁ దొడిగి శ్రోణీసూత్రంబును బంధించి శంఖచక్రగదా ఖడ్గంబులను సవరించి గరుడవాహనారూఢుఁడై కాంచనగిరిశృంగంబున సతటిజ్జీమూతమట్లు శోభిల్లుచు హుటాహుటిఁ దరలెను. సిద్ధచారణ గంధర్వులు పాడిరి. దేవర్షులు జయంబులు పలికిరి. గరుడుఁడు ఱెక్కలు విదలించెను. ఆ గాలివడికి వైరిసైన్యము వికీర్ణశస్త్రము భ్రమత్పతాక మునై క్షోభించి యుఱ్ఱూఁతలూఁగెను.'

## విష్ణువు మాల్యవదాదులను నిర్జించుట

'రాక్షసాంబుదంబులు గర్జించుచు శరములు వర్షించుచు నారాయణుని ముట్టడించెను. నల్లని నక్తంచరులు శ్యామావదాతుండగు విష్ణువును జుట్టియుంటం జూడంగా వర్షమాణపయోధరంబు లంజనాద్రిని జుట్టిన వైఖరి దోంచెను. రాక్షసధనుర్ముక్తబాణంబులు వజ్రానిలమనోజవంబులం జని మిడుతలు కేదారంబును, మశకంబులు పర్వతంబును, దంశంబులు మధుఘటంబును, మకరంబులు సాగరంబును వలె హరిని గ్రమ్ముకొనుటచే లోకంబులు ప్రళయంబునం దట్లాయెను. రథారూఢులు రథంబులను, గజారూఢులు గజంబులను, హయారోహకులు హయంబులను, మాధవునిపైకిం బురికొల్పిరి. కొందఱు శరపరంపరల ఉవ్విరి; కొందఱు శక్తితోమరంబులను బఱపిరి. అవియెల్ల మూంగి హరికి నూపిరాడనీయవయ్యెను. ఆ మహనీయుండు కోపము వహించి కోదండంబును బూని మనోజవంబులును వజ్రసన్నిభంబులు నైన శరంబులను సంధించి యాకర్ణాంతము దివిచి పుంఖానుపుంఖంబుగా సారించెను. సూర్యునుండి కిరణంబులట్లు, సాగరంబునుండి తరంగంబులకరణి, పర్వతంబులనుండి నాగేంద్రంబుల చందాన, మేఘంబులనుండి ధారాపాతముక్రియ, మాధవుని కోదండంబునుండి శరంబులు, పరంపరలుగా నుప్పతిల్లి రాక్షసయూథంబును గప్పెను. వారు దిక్కుఱి శరభంబులకు సింహంబులట్లు, సింహంబులకు ద్వీపంబులవలె, ద్వీపంబులకు వ్యాఘ్రంబులకరణి, వ్యాఘ్రంబులకు ద్వీపులక్రియ, ద్వీపులకు శునకంబులవహి, శునకంబులకుం బిల్లులరీతిం, బిల్లులకు సర్పంబులపోలిక, సర్పంబులకు నెలుకల చాయం బఱచుచు బొబ్బలు దూలుచుం గళవళించుచుం గుందుచు గ్రుంగుచుం బటాపంచలైరి. అందుం గొందఱు వజ్రఘాతంబుల శైలంబులట్లు కూలిరి; మఱికొందఱు వ్రణాంకితులై పర్వతంబులు స్వర్ణధారలట్లు రక్తధారల నోడ్చిరి.

'నారాయణుం డట్లు గావించి పాంచజన్యంబును బూరించెను. ఆ శంఖారావము త్రైలోక్యవ్యథాకరంబుగా ధ్వనింప నమ్మహానిర్హ్రాదంబునకు హతశేషులగు రక్కసులు గుండియలు వ్రీలి ససిచెడి మృగరాజు చొచ్చిన కరియూథంబు చాడ్పునం జెల్లాచెదరై పడుచు లేచుచు లంక దారిం బట్టిరి. అసురసైన్య మట్లగుట సుమాలి గాంచి కోపక్రోధమూర్ఛితుండై విష్ణువును దలపడి వానిపయి నంపవానం గురిసి నిజసైన్య

